ఎస్. అక్సాకోవ్

# ఎర్ర పువ్వు

చిత్రాలు: జి. అన్‌ఫీలొవా



"ప్రగతి" ప్రచురణాలయం
మాస్కో



అనగా అనగా ఒకానొక రాజ్యంలో, ఒకానొక దేశంలో, పేరుమోసిన ఒక ధనిక వర్తకుడు వుండేవాడు.

వెండిబంగారపు రాశులు, ముత్యాలు, వజ్రవైడూర్యాలు, రత్న మాణిక్యాలు, దూరదేశాలనుంచి తెచ్చిన విలువైన వస్తువులు — యిలా అతనికి రకరకాల సంపద వుంది. ఈ వర్తకుడికి ముగ్గురు కూతుళ్లు వున్నారు. ముగ్గురూ వర్ణించ శక్యం కానంతటి అందాల రాశులు. అయితే, వాళ్ల ముగ్గురిలోనూ మూడో అమ్మాయి మరీ అందమైంది.

ఓరోజున, యీ వర్తకుడు, తన సరుకులతో ఓడపైన, దూర తీరాల్లో వున్న దేశాలకు వెళ్లాలని సన్నద్ధమయాడు. బయల్దేరే ముందు, తన ప్రియమైన కూతుళ్లతో యిలా అన్నాడు:

“ఓ నా దయార్ద్రమైన, ప్రియమైన, సుకుమారమైన బంగారు తల్లులూ, నేను వర్తకం నిమిత్తం ఓడలు తీసుకొని సముద్రం అవతలి దేశాలకు వెళ్తున్నాను. నేను లేనప్పుడు మీరు నీతిగా, శాంతంగా జీవించాలని నేను ఆదేశిస్తున్నాను. మీరు నేను చెప్పినట్లు చేస్తే మీరు హృదయపూర్వకంగా కోరుకొనే బహుమతులు మీకు తెచ్చిపెడతాను. మీకు ఏమేమి కావాలో తేల్చుకునేందుకు మీకు మూడు రోజుల వ్యవధి యిస్తున్నాను. అప్పుడు మీకు ఏమేమి బహుమతులు కావాలో చెప్పురుగాని.”



మూడుపగళ్లూ, మూడు రాత్రులూ వాళ్ళు గుంపుతెంపీలు పడ్డారు. తర్వాత వచ్చి తమ తండ్రితో ఒక్కొక్కళ్ళకి ఏమేమి బహుమతులు కావాలో చెప్పారు. మొదటి కూతురు తండ్రికి వంగి నమస్కరించి, యిలా చెప్పింది:

"ప్రియమైన నాన్నగారూ, నాకు బంగారు జరీ వస్త్రంగాని, వెండి జరీ వస్త్రంగాని అక్కర్లేదు. ధృవప్రాంతపు జంతువు నల్ల చర్మం అక్కర్లేదు, అద్భుతమైన ముత్యాలు అక్కర్లేదు. పున్నమి చంద్రుడిలా, మిట్ట మాధ్యాహ్నపు సూర్యుడిలా ప్రకాశించే, రాత్రి చీకటిని పట్టపగలులా మార్చివేసే, వజ్రవైడూర్యాలూ, రత్న మాణిక్యాలూ పొదిగిన బంగారు కిరీటం ఒక్కటి తెచ్చిపెట్టండి చాలు."

ఆ వర్తకుడు క్షణకాలం ఆలోచించి, యిలా అన్నాడు:

"అలాగే కానియ్యి పెద్దమ్మాయీ, నీకు సరిగా అలాంటి కిరీటమే తెచ్చిపెడతాను, సరేనా. సముద్రం అవతల ఒక దేశంలో, ఒక యువరాణికి చెందిన అలాంటి కిరీటం వుంది. అది ఒక పర్వత గుహలోని రాతి గదిలో దాచబడి వుంది. దాన్ని చేరుకోవాలంటే జర్మన్ తాళాలు బిగించిన మూడు యినుపగేట్లు దాటి వెళ్లాలి. పని తేలికైనది కాకపోయినా, నా ఐశ్వర్యానికి సాధ్యం కానిదేమీ లేదు."

తర్వాత అతని రెండో కూతురు వంగి నమస్కరించి యిలా చెప్పింది:

"ప్రియమైన నాన్నగారూ, నాకు బంగారు జరీ వస్త్రంగాని, వెండి జరీ వస్త్రంగాని అక్కర్లేదు, సైబీరియన్ ప్రాంత జంతువు నల్ల చర్మం అక్కర్లేదు, అద్భుతమైన ముత్యాల పేరు అక్కర్లేదు, వజ్రవైడూర్యాలూ, రత్న మాణిక్యాలూ పొదిగిన బంగారు కిరీటం అక్కర్లేదు. తూర్పుదేశాల స్ఫటిక స్వచ్ఛమైన అద్దం ఒకటి తెచ్చిపెట్టండి. దానిలో చూస్తే యీ ప్రపంచపు అందమంతా విశుద్ధంగా, లోపరహితంగా కనిపించాలి. దానిలోకి చూస్తే నాకు ఎప్పటికీ ముసలితనం రాకుండా వుండాలి. నా కన్నె ప్రాయపు అందం వెయ్యిరెట్లు పెరగాలి."

ఆ వర్తకుడు దీర్ఘాలోచనలో మునిగాడు, తర్వాత యిలా అన్నాడు:

"సరే, అలాగే కానియ్యి అమ్మాయ్. నువ్వు వర్ణించిన స్ఫటికపు అద్దాన్ని నీకు తెచ్చిపెడతాలే. పర్షియా రాజకుమార్తె దగ్గర సరిగా అలాంటి అద్దమే వుంది. ఎత్తైన పర్వత శిఖరాగ్రంపైన నిర్మించబడిన పొడవాటి, సుదృఢమైన రాతి గోపురంలో ఆ అద్దం దాచబడివుంది. ఏడు తాళాలు బిగించబడిన ఏడు



ఇనుప ద్వారాల వెనుక ఆ అద్దం ఉంచబడింది. ఆ రాతి గోపురాన్ని చేరుకోడానికి మూడు వేల మెట్లు ఎక్కి వెళ్లాలి. వాటిలో ప్రతి ఒక్క మెట్టుపైనా వాడియైన పెద్ద విచ్చుకత్తులతో, పర్షియన్ పహరా సైనికులు నిలబడి, రాత్రింబగళ్లు కంటిపైన రెప్పవెయ్యకుండా, ఆ విలువైన అద్దాన్ని కాపలా కాస్తూ వుంటారు. ఆ ఇనుప ద్వారాల తాళం చెవుల గుత్తి ఆ రాజకుమార్తె నడుముకిగల వడ్డాణానికి వేలాడుతూ వుంటుంది. మీ అక్క కోర్కెను తీర్చడం కన్న యిది కష్టతరం. అయినా, నా ఐశ్వర్యానికి సాధ్యం కాని దేమీ లేదు.''

ఆ తర్వాత మూడో కూతురు తన తండ్రికి వంగి నమస్కరించి, యిలా చెప్పింది:

''ప్రియమైన నాన్నగారూ, నాకు బంగారు జరీ వస్త్రంగాని, వెండి జరీ వస్త్రంగాని అక్కర్లేదు, సైబీరియా ప్రాంత జంతువు నల్ల చర్మం అక్కర్లేదు, అద్భుతమైన ముత్యాల హారం అక్కర్లేదు. వజ్రవైడూర్యాలూ, రత్న మాణిక్యాలూ పొదిగిన బంగారు కిరీటం అక్కర్లేదు, స్ఫటికపుటద్దమూ అక్కర్లేదు. ఈ విశాల ప్రపంచంలో కెల్ల మిక్కిలి అందమైన ఎర్ర పువ్వు తెచ్చిపెట్టండి నాకు, అంతే చాలు.''

ఆ వర్తకుడు ముందరికన్న మరింత గట్టిగా ఆలోచించాడు. అతను ఎంత సేపు అలా ఆలోచించాడో నేను చెప్పలేనుగాని, చివరకు అతను మనస్సును కూడదీసుకున్నాడు. ప్రియాతిప్రియమైన తన ముద్దుల మూడవ కూతుర్ని అతను ముద్దుపెట్టుకొని, కౌగలించుకొని యిలా అన్నాడు:

''అలాగేనమ్మా, కాని నువ్వు నాకు మీ అక్కల కన్న కష్టతరమైన పరీక్ష పెట్టావు. తనేమి వెతకాలో మనిషికి తెలిస్తే, అతను తప్పకుండా దాన్ని వెతికి పట్టుకోవచ్చు, కాని తనకి తెలియని దాన్ని అతనెలా వెతకగలడు? ఎర్ర పువ్వుల్ని కనుక్కోవడం కష్టం కాదు, కాని, యీ విశాల ప్రపంచమంతట్లోకీ మిక్కిలి అందమైన పువ్వేమిటో నేను తెలుసుకోవడం ఎలా? నేను నా శాయశక్తులా ప్రయత్నిస్తాను, అయితే, నేను తెచ్చిన కానుక నీకు నచ్చకపోతే నామీద కోపం తెచ్చుకోకు అమ్మాయ్.''

అతను విదేశాలకు చేరుకున్నాడు, అపరిచిత ప్రాంతాల్లో పర్యటించాడు. తన పెద్ద కూతురు కోరుకున్న బహుమతిని — రాత్రి చీకటిని పట్టపగలుగా మార్చేసే, వజ్రవైడూర్యాలూ, రత్న మాణిక్యాలూ పొదిగిన బంగారు కిరీటాన్ని — అతను సంపాదించాడు. తన రెండో కూతురు కోరుకున్న బహు



మతిని — ప్రపంచంలోని అందాన్నంతటినీ ప్రతిబింబించే, దానిలోకి చూసే ఆమెకు ఎన్నడూ ముసలి తనం రాకుండానే కాకుండా, నిత్యయౌవనవతినిగా ఉంచే స్ఫటికపుటద్దాన్ని — కూడా అతను సంపాదించాడు. అయితే, అతని చిన్నారి ముద్దుల కూతురు కోరిన బహుమతి — యీ విశాల ప్రపంచంలోని అన్నింటి కన్న ఎక్కువ అందమైన ఎర్ర పువ్వు — మాత్రం అతనెక్కడా సంపాదించలేకపోయాడు.

రాజుల, రారాజుల, సుల్తాన్ల తోటల్లో అతను ఎన్నో ఎర్ర పువ్వులను చూశాడు. కథల్లో చెప్పు కొనేటంత, మాటల్లో వర్ణించలేనంత ఎక్కువ అందంగా వున్నాయి అవి. అయితే ఫలానా యీ పువ్వు ప్రపంచంలో కెల్ల మిక్కిలి అందమైనదని ఎవరూ కచ్చితంగా చెప్పలేకపోయారు. అతని మట్టుకు అతనికీ స్థిరంగా తేలింది కాదు. నమ్మకస్తులైన తన సేవకులతో అతను యిసుక ఎడారులగుండా, దట్ట మైన అడవులగుండా ప్రయాణం చేస్తూండగా అకస్మాత్తుగా ఒక దొంగల గుంపు అతనిపైన దాడి చేసింది. అలాంటి దురదృష్టం వాటిల్లడంతో ధనరాశులతో కూడిన బిడారునూ, నమ్మకస్తులైన సేవ కులనూ వదిలిపెట్టి చీకటి గుయ్యారంలా వున్న అడవిలోకి పారిపోవడం తప్ప ఆ వర్తకుడికి మరో గత్యం తరం లేకపోయింది. "దొంగల చేతుల్లో చిక్కి, జీవితాంతందాకా వాళ్ల చేతుల్లో బందీగా వుండేదాని కన్న, క్రూర మృగాలు నన్ను పీక్కుతిన్నా మేలే!" అనుకున్నా డతను.

అందుకని అతను, ఆ దట్టమైన, కాకులు దూరని కారడవిలో తిరుగాడాడు. అతను లోపల లోపలకి వెళ్లేకొద్దీ, చెట్లూ, దట్టమైన పొదలూ విడివడి అతనికి దోవ యిస్తున్నట్లు కాగా, నడక మరింత తేలికైంది. ఆ వర్తకుడు ఆశ్చర్యపోయాడు. ఈ చిత్రమైన విషయాన్ని అతను అర్థం చేసుకో లేకపోయాడు. అతను తనముందు కనిపిస్తున్న నలిగిన దారివెంట మున్ముందుకు పోసాగాడు. ఉదయంనుండి సాయంత్రందాకా అతను నడుస్తూనే వున్నాడు. అతని చుట్టూ శ్మశాన నిశ్శబ్దం ఆవరించింది. అటు తర్వాత గాఢరాత్రి కమ్ముకుంది. అతని పాదాలకింద దారిపైన వెలుగు పొడ తప్ప అతని చుట్టూ కటిక చీకటి అలుముకుంది. అర్ధరాత్రిదాకా అతను అలా ముందుకు నడుస్తూనే వున్నాడు. అతనికి ఎదుట ఎర్రని వెలుతురు కనిపించసాగింది. అతను దూరం వెళ్లేకొద్దీ వెలుగు మరింత ప్రకాశవంతమై, చివరకు పట్టపగలు మాదిరిగా మారిపోయింది. అయినా అతనికి శబ్దంగాని, మంట మండేటప్పుడయ్యే చిట పటలుగాని వినరాలేదు. చిట్టచివరకు అతనొక బయలు ప్రదేశంలోకి చేరుకున్నాడు. అక్కడ మధ్యగా విచిత్ర



మైన దృశ్యం అతని కళ్లబడింది. అది రాజప్రాసాదంలా వుంది. వెండిబంగారాల, నవరత్నాల తళుకులతో ధగద్ధగాయ మానంగా ప్రకాశిస్తోంది. జాజ్వల్యమానంగా, కళ్ల మిరుమిట్లు గొలుపుతోంది. అయితే అక్కడెక్కడా మంట కనిపించలేదు. దాని వంక చూస్తూంటే మిట్టమధ్యాహ్న సూర్యుణ్ణి చూస్తున్నట్లు కళ్లు నొప్పిపుట్టాయి. ఆ రాజప్రాసాదపు కిటికీలన్నీ తెరుచుకున్నాయి. లోపల్నుంచి, ఆ వర్తకుడికి తన జీవితంలో యింతవరకెన్నడూ విననంతటి మధురమైన సంగీతం వినవచ్చింది.

తెరిచివున్న ఎత్తైన సింహద్వారాల గుండా విశాలమైన ప్రాంగణం దాటి, బంగారు మలాము చేసిన మెట్ల కమ్మీలను పట్టుకొని, ఎర్రగుడ్డ పరిచిన మెట్లనెక్కి, అతను రాజప్రాసాదంలో ప్రవేశించాడు. మొదటి హాల్లోకి, తర్వాత రెండోదానిలోకి, అటు తర్వాత మూడో హాల్లోకి అతను వెళ్లాడు. అతనికి ఎవ్వరూ కనిపించలేదు. అతనలా పోయిపోయి అయిదో హాలును, పదో హాలును చేరుకున్నాడు. అప్పటికీ అతనికి ఎవరూ కనిపించలేదు. కాని అతనికి నలువంకలా తను జీవితంలో ఎన్నడూ చూసివుండని వెండి బంగారాలతో, తూర్పుదేశాల స్ఫటికాలతో, ఏనుగు దంతాలతో చేసిన రాజోచితమైన సామాన్లు కనిపించాయి.

అపరిమితమైన ఆ సంపద ఆ వర్తకుడికి ఆశ్చర్యం గొలిపింది. అతనికి యింకో విషయం మరింత ఆశ్చర్యాన్ని కలిగించింది. అక్కడ యజమాని జాడగాని, సేవకుల జాడగాని లేకపోవడమే అది. అయితేనేం, సంగీతం అలలు అలలుగా గాలిలో తేలివస్తోంది. అప్పుడా వర్తకుడు తనలో తను యిలా అనుకున్నాడు: ''ఈ ఆడంబర అలంకారాలన్నీ చాలా బాగానే వున్నాయి, కాని తినేందుకు యిక్కడేమీ లేదే.'' అతనలా అనుకున్నాడో లేదో, అతని కళ్ల ముందొక బల్ల పరుచుకుంది, పంచభక్ష్య పరమాన్నాలతో, నవకాయ పిండివంటలతో కూడిన వెండి, బంగారు పళ్లెరాలు, విదేశీ ద్రాక్ష సారాయాలు, తేనెసారా ప్రత్యక్షమయాయి. అతను పూర్తిగా రోజురోజంతా ఏమీ తినలేదేమో, వెంటనే కూర్చుని, తృప్తిదీర తిని, తనివిదీర తాగాడు. వంటకాలు వర్ణించనలవిగానంత రుచిగా వుండి, గిన్నెలు ఊడ్చేసేటంతగా ప్రలోభపెడుతున్నాయి. భోజనం పూర్తికాగానే, అతను బల్లముందునుంచి లేచి, చుట్టూ చూశాడో లేదో, ఆ మరుక్షణమే భోజనంబల్లా, దానిమీద సామానూ అన్నీ, అక్కడెన్నడూ లేనే లేవా అన్నట్టు, మాయమైపోయాయి. అంతసేపూ, సంగీతం నిరంతరాయంగా వినిపిస్తూనేవుంది.

ఈ వింతలూ, విడ్డూరాలతో ఆ వర్తకుడి మనస్సు ఆశ్చర్యంతో నిండిపోయింది. వైభవోపేతమైన

ఆ గదులగుండా ముందుకు వెళ్తూ అతను తనలో తను యిలా అనుకున్నాడు: "హాయిగా పడుకుని, సుఖంగా నిద్రపోగలిగితే ఎంతబాగుండును!" అతనలా అనుకున్నాడో లేదో చూసుకో నాయనా! అతని ముందు స్ఫటికపు కోళ్ళతో వున్న మేలిమి బంగారపు పట్టె మంచం ప్రత్యక్షమైంది. ఆ మంచంపైన ముత్యాలసరాలతో కూర్చబడిన కుచ్చుల అంచులు గల వెండి చాందినీ తెర వుంది.

విచిత్రమైన యీ ఆశ్చర్యం ఆ వర్తకుడికి మరింత విభ్రాంతి కలిగించింది. అయితేనేం, అతనా మంచంమీద శరీరం వాల్చి, పట్టులా మెత్తగా వున్న వెండి చాందినీ తెరను మూసుకున్నాడు. అసుర సంధ్య వేళ మాదిరిగా గదిలో నును చీకటి ఆవరించింది, సంగీతం దూరదూరాలకు జరిగి అస్పష్టమై పోయింది. "కనీసం కలలోనైనా, నా కూతుళ్లను చూడగలిగితే ఎంత బాగుండును!" అనుకున్నాడతను. ఆ మరుక్షణమే అతను నిద్రలో కూరుకుపోయాడు.

వర్తకుడు నిద్రలేచేసరికి, సూర్యుడు అప్పుడే నడినెత్తిమీదకు వచ్చాడు. రాత్రంతా అతను, తన అందమైన, మంచి కూతుళ్లను గురించి కలగన్నాడు. తన పెద్ద కూతుళ్లిద్దరూ సరదాగా, హుషారుగా వుండటం, తన ముద్దుల మూడవ కూతురు మాత్రం దిగాలుగా వుండటం, తన కలలో అతను చూశాడు. తన పెద్ద కూతుళ్ళ యిద్దరికీ ధనికులైన పెళ్లికొడుకులు వచ్చారు. తమ తండ్రి ఆశీస్సులు లేకుండానే వాళ్ళు పెళ్లి చేసుకునేందుకు సిద్ధంగా వున్నారు. అయితే ముగ్గురిలోకీ మిక్కిలి అందమైనదీ, ప్రియమైనదీ అయిన చిన్న కూతురు మాత్రం తన తండ్రి యింటికి వచ్చేదాకా పెళ్లి కొడుకుల సంగతి వినేందుకే సిద్ధపడలేదు. అది చూసిన వెంటనే అతని హృదయం ఒక వంక సంతోషంతోనూ, మరో వంక విచారంతోనూ నిండిపోయింది.

పడకమీంచి దిగగానే, దుస్తులు సిద్ధంగా వుండటం, స్ఫటికపు తొట్టెలోకి జలధారలోంచి నీళ్ళు చిమ్ముతూ వుండటం అతనికి కనిపించాయి.

అతను ఒళ్ళు కడుక్కొని, దుస్తులు ధరించాడు. ఇప్పుడతను ప్రతి కొత్త విచిత్రానికీ విభ్రాంతి చెందడం మానేశాడు. మిఠాయిల పళ్లెం పక్కన ఆవిర్లు కక్కే టీ, కాఫీలు టేబిలుపైకి వచ్చాయి. ప్రార్థన చేసుకున్నాక తనివిదీర ఫలహారంచేసి, మరోసారి రాజప్రాసాదాన్ని పరిశీలించేందుకూ, బంగారు వన్నె సూర్యకాంతిలో దాని అందాన్ని చూసేందుకూ అతను బయల్దేరాడు.



ఈమారు అతను బంగారు తాపడపు కమ్మీలను పట్టుకొని, రాగిఖనిజపు పలుకులు తాపిన ఆకు పచ్చని చంద్రకాంత శిలల పలకల మెట్లు దిగి, నేరుగా నవనవలాడే పచ్చని తోటల్లోకి దిగాడు. అక్కడ అతను ఆరముగ్గిన ఎర్రని పళ్లతో నిండివున్న చెట్లమధ్య పచార్లు చెయ్యనారంభించాడు. తమను తినమని ఆహ్వానిస్తున్నట్లున్న ఆ పళ్లు అతని నోరూరించాయి. అందమైన, రకరకాల, కళ్లకు నదరైన రంగురంగుల పూలు పూర్తిగా విచ్చి, సువాసనలు గుబాళిస్తున్నాయి. వింతపక్షులు గంధర్వగానం చేస్తూ అటూ యిటూ ఎగురుతున్నాయి. ఫౌంటెన్లనుండి ఆకాశంలోకి నీళ్లు ఎగుస్తున్నాయి. ఆ ధారల కొసలను చూడాలంటే మనిషి తన తలను వెనక్కి వాల్చవలసినంత ఎత్తుగా లేస్తున్నాయవి. స్వచ్ఛమైన నీటితో స్ఫటికశిలల కాల్వల్లో సెలయేళ్లు మర్మర ధ్వనులు చేస్తూ ప్రవహిస్తున్నాయి.

మన వర్తకుడు భయసంభ్రమంతో నడుస్తున్నాడు. అంతలో అకస్మాత్తుగా పచ్చిక మొలిచిన ఒక మట్టిదిబ్బమీద ఎర్రటి పువ్వొకటి అతని కంటబడింది. మాటల్లో చెప్పడానికీ, కలంతో వర్ణించడానికీ సాధ్యంకానంత అందంగా వుందది. ఆ వర్తకుడి గుండె కొట్టుకోవడం ఆగినంత పనైంది. అతనా పువ్వును సమీపించాడు. ఒక పరిమళ వాహిని మాదిరిగా ఆ పువ్వు సువాసన ఆ తోటలోని గాలినంతా ఆవరించినట్లు అతను గ్రహించాడు. అతని కాళ్లూ, చేతులూ కంపించాయి. అతను సంతోషంగా కేక వేశాడు:

"నా ముద్దుల కూతురు నన్ను తెమ్మన్న ఎర్ర పువ్వు యిదే! ప్రపంచంలో దీని అందానికి సాటి మరేదీ లేదు!"

ఆ మాటలు అంటూ, అతనా ఎర్ర పువ్వును సమీపించి, దాన్ని తుంపాడు. అదే క్షణంలో, ఏ కారుమబ్బులూ లేకుండానే కళ్లు మిరుమిట్లు గొలిపేలా మెరుపులు మెరిశాయి, ఉరుములు గర్జించాయి. అతని కాళ్లకింది నేల గజగజా కంపించింది. ఆ వర్తకుని ముందు, నేలను చీల్చుకొని పైకొచ్చిందా అన్నట్లు, జంతువూ కాని, మనిషీ కాని ఒక విచిత్ర జీవి జీబూతం వంటి జుట్టుతోనిండి చూడటానికి భయం గొలిపే అడవి మృగం ప్రత్యక్షమైంది. ఆ అడవి మృగం ఆటవిక స్వరంలో యిలా అరిచింది:

"నువ్వు చేసిన పనేమిటి? నా అభిమానపాత్రమైన యీ పువ్వును, నా తోటలోని పవిత్రమైన పువ్వును తుంపడానికి నీకెన్ని గుండెలున్నాయి? నేను దాన్ని నా కంటిపాప కంటె భద్రంగా పెంచి పోషిం

చాను. నేను రోజూ దాన్ని చూసుకొని మురిసిపోతూ వున్నాను. అలాంటిది, నువ్వు నా జీవితంలోని ఆనందాన్నంతనీ ధ్వంసం చేసేశావు: ఈ రాజప్రాసాదానికీ, యీ తోటకీ నేను ప్రభువుని. ప్రియమైన, గౌరవనీయుడైన ఒక అతిథిగా నీకు నేను స్వాగతం చెప్పాను. నీకు నేను తిండితీర్థాలూ, విశ్రాంతీ యిచ్చాను. నా మంచికంతకీ నువ్వు బదులుతీర్చుకునే పద్ధతి యిదేనా? మరి, నీకు మూడబోయే గతి ఏమిటో చెప్తా విను, నువ్వు చేసిన నేరానికి గాను, నీ ఆయువు ముగిసిపోకముందే నువ్వు ప్రాణం కోల్పోతావు!''

చుట్టూ అన్ని పక్కల్నుంచీ ''నీ ఆయువు ముగిసిపోకముందే నువ్వు ప్రాణం కోల్పోతావు!'' అంటూ ఆటవిక స్వరాలు ఒక్కుమ్మడిగా రెట్టించాయి. భయంకరమైన ఆ పెద్ద అడవి మృగం ముందు మోకాళ్లపై వంగి, జాలిగొలిపే స్వరంలో వర్తకుడు దీనాతిదీనంగా యిలా వేడుకున్నాడు:

''ప్రియమైన ప్రభూ, దయామయా, అడవి మృగమా, పాతాళ వాసీ — మిమ్మల్ని ఎలా పిలవాలో నాకు తెలియకుండా వుంది. తెలియక చేసిన నా యీ సాహసానికి దైవభక్తుణ్ణి అయిన నన్ను అంతం చెయ్యకండి. నన్ను ముక్కముక్కలుగా ఖండించకండి. నేను మిమ్మల్ని వేడుకుంటున్నాను. నాకు ముగ్గురు కూతుళ్లున్నారు ముగ్గురూ అందమైన, దయాపరులైన కన్నెపడుచులు. నేను వాళ్ల ముగ్గురికీ మూడు బహుమతులు తెచ్చిపెడతానని వాగ్దానంచేశాను. పెద్దమ్మాయికి వజ్రవైదూర్యాలూ, రత్న మాణిక్యాలూ పొదిగిన బంగారు కిరీటం, రెండో అమ్మాయికి స్ఫటికపుటద్దం, చిన్నమ్మాయికి ప్రపంచంలో అన్నిటికంటె అందమైన ఎర్ర పువ్వు. మా పెద్దమ్మాయిలు యిద్దరికీ నేనిస్తానన్న బహుమతులు ఎక్కడైతేనేం, మొత్తంమీద నాకు దొరికాయి. తర్వాత యిక్కడీ తోటలో చూద్దును కదా, ప్రపంచంలో అన్నిటికన్న అందమైన ఎర్ర పువ్వు నాకు కనిపించింది. అంతటి మహైశ్వర్యవంతుడైన, వైభవోపేతుడైన ప్రభువు, నా చిన్న కూతురు కోరుకున్న యీ చిన్న ఎర్ర పువ్వును కోసుకుంటే ఏమీ అనుకోడని నేను భావించాను. నేను తెలివితక్కువగా, మూర్ఖంగా ప్రవర్తించాను, నన్ను క్షమించండి దేవరా, నన్ను విడిచిపెట్టండి, నేను నా ప్రియమైన కూతుళ్ల దగ్గరకు పోయేందుకు అనుమతించండి. నా ముద్దుల చిన్న కూతురికి బహుమతిగా నన్నీ ఎర్ర పువ్వును తీసుకెళ్లనివ్వండి. దానికి మీరెంత ధర చెప్తే, అంతా నేను బంగారు మొహిరీల్లో చెల్లించుకుంటాను.''

ఓ పెద్ద నవ్వురొద అడవి అంతటా మార్మోగింది. ఆకాశంలో ఉరుములు గర్జించినట్లుంది ఆ నవ్వు. బిలవాసియైన ఆ భయంకర అడవి మృగం వర్తకుడితో యిలా అంది:

"నీ బంగారు మొహిరీలు నాకు అక్కర్లేదు. నాకున్న వాటిని దాచుకోడానికే నాకు స్థలం చాలడం లేదు. అయితే నీ విముక్తికి ఒకే ఒక్క మార్గం వుంది. నీ స్థానంలో, నీ ముగ్గురు కూతుళ్లలో ఎవరో ఒకర్ని, యిక్కడికి పంపుతానని ఒట్టేసి చెప్తే, నేను నిన్ను సురక్షితంగా యింటికి పంపిస్తాను, అపారమైన ధనరాసులు యిస్తాను, నీకు యీ ఎర్ర పువ్వు యిస్తాను. ఆమెకు ఎటువంటి హానీ జరగదని మాట యిస్తున్నాను. నువ్వు నా రాజభవనంలో ఉన్నట్లుగానే ఆమె కూడా యిక్కడ గౌరవంగా, స్వేచ్ఛగా జీవిస్తుంది. నేనిక్కడ ఒంటరిగా వున్నాను. నాకొక తోడు కావాలి."

"దయామయా, బిలవాసియైన వనదేవతా! అయితే, నా కూతుళ్లు యిష్టపూర్తిగా నీ దగ్గరకు రాకపోతే నేనేం చెయ్యాలి? వాళ్లు నీ దగ్గరకు ఏ మార్గాన చేరుకోవాలి? నేనిక్కడికి చేరుకోడానికి నాకు రెండేళ్లు పట్టింది — ఏయే స్థలాలు దాటి, ఏయే బాటల వెంట వచ్చానో నాకే తెలియదు."

బిలవాసియైన భయంకర అడవి మృగం ఆ వర్తకుడికి యిలా జవాబిచ్చింది:

"బందీయైన కన్నె, నాకిక్కడ అవసరం లేదు. నువ్వంటే వున్న ప్రేమకొద్దీ, తనంతట తను యిష్టపడి నీ కూతురు యిక్కడకు రావాలి. నీ కూతుళ్లు తమంతట తాము కోరుకొని యిక్కడికి రాకపోతే, అప్పుడిక నువ్వే యిక్కడికి రావాలి. నిన్ను క్రూరంగా వధిస్తాను. ఇక్కడికెలా ప్రయాణం చెయ్యాలన్నదానితో నీకు పనిలేదు. నీకు నేను నా వేలిని వున్న యీ ఉంగరం యిస్తాను. ఎవరైతే యీ ఉంగరాన్ని తన కుడిచేతి చిటికెన వేలికి ధరిస్తాడో అతను, రెప్పపాటు కాలంలో తను కోరుకున్నచోట వుంటాడు. ఇంట్లో వుండేందుకు నీకు నేను మూడు పగళ్లూ, మూడు రాత్రిళ్లూ అనుమతి యిస్తున్నాను."

ఆ వర్తకుడు చాలాసేపు గట్టిగా ఆలోచించాడు. చివరకు ఒక నిర్ణయానికి వచ్చి, యిలా అనుకున్నాడు: "నేను నా కూతుళ్లని మరో సారి కళ్లారా చూసి, తండ్రిగా వాళ్లకి నా ఆశీస్సులు యివ్వడం మంచిది. నన్ను చావునుంచి తప్పించడానికి వాళ్లు యిష్టపడకపోతే, అప్పుడిక నేను నిజమైన దైవభక్తుడి మాదిరిగా చచ్చిపోయేందుకు సిద్ధమై, బిలవాసియైన, భయంకర అడవి మృగం దగ్గరకు తిరిగి రావాలి." మనస్సులో కృత్రిమం లేదేమో అతనీ మాటలు బిగ్గరగానే అన్నాడు. ఒక వేళ పైకి అనకపోయినా కూడా,



అతని మనస్సులోని మాట బిలవాసియైన ఆ భయంకర అడవి మృగానికి ఎరుకే. ఆ అడవి మృగం అతను నిజాయితీపరుడన్న సంగతి గ్రహించి, తన వేలినున్న బంగారు ఉంగరాన్ని తీసి, ఆ వర్తకుడికి అందించింది.

ఆ వర్తకుడు ఆ ఉంగరాన్ని తన కుడిచేతి చిటికెన వేలికి తగిలించుకున్నాడో లేదో, మరుక్షణమే తన భవనపు విశాలమైన ఆవరణ గేటుదగ్గర వున్నాడు. అదే క్షణంలో, ధనరాసులతో కూడిన బిడారులు అక్కడికి చేరుకున్నాయి. వాటి వెంట అతని నమ్మకస్తులైన సేవకులు కూడా చేరుకున్నారు. ఇంట్లో పెద్ద సంరంభం బయల్దేరింది. వర్తకుడి కూతుళ్ళు తమ తండ్రిని కౌగలించుకొని, ముద్దుపెట్టుకొనేందుకని చెంగున పరిగెత్తారు. చిన్నకూతురుకన్న పెద్దకూతుళ్లిద్దరూ మరింత వెర్రిప్రేమ ప్రకటించారు. అంతలోనే, ఏదో తేడా ఉన్నట్టూ, తమ తండ్రి మనస్సును ఏదో తెలియని విచారం పీడిస్తున్నట్టూ వాళ్ళు గ్రహించారు. అతని పెద్ద కూతుళ్లిద్దరూ, అతని అపారమైన సంపదకేమైనా నష్టం వాటిల్లిందా అని అడిగారు. అయితే చిన్న కూతురు మాత్రం అతని సంపద సంగతి పట్టించుకోక, తండ్రిని యిలా ప్రశ్నించింది:

"నాన్నగారూ, మీ సంపదతో నాకు పని లేదు. దాన్ని మళ్లీ సంపాదించుకోవచ్చును. మీ మనస్సుని పీడిస్తున్న బాధ ఏమిటో నాతో చెప్పండి."

వర్తకుడు మంచివాళ్ళూ, దయాపరులూ అయిన అందమైన తన కూతుళ్లకు యిలా బదులు చెప్పాడు:

"అపారమైన నా సంపదకు నష్టమేమీ కలగలేదు. సరికదా, అది మూడునాలుగు రెట్లు పెరిగింది. నన్ను మరో విచారం పీడిస్తోంది. దాని విషయం మీకు నేను రేపు చెప్తాను, ఈ రోజుకు మనం సరదాగా గడుపుదాం."

తర్వాత అతను, ప్రయాణంలో తను తీసుకువచ్చిన ఇనప్పెట్టెలను లోపలకు తీసుకురమ్మని ఆజ్ఞాపించాడు. తన పెద్దకూతురుకి, బంగారంతో చేసిన కిరీటాన్ని బహుమతిగా యిచ్చాడు. రెండో కూతురికి తూర్పుదేశాల స్ఫటికపుటద్దాన్ని బహుమతిగా యిచ్చాడు. తన మూడవ కూతురికి బంగారు భరిణలో వున్న ఎర్ర పువ్వును కానుకగా యిచ్చాడు. పెద్ద కూతుళ్లిద్దరూ సంతోషంతో పొంగిపోయారు. కాని



అతని ముద్దుల మూడవ కూతురు ఆ ఎఱ్ఱ పువ్వును చూడగానే, గజగజా వణికిపోయింది. తన హృదయం బద్దలవుతుందేమో అన్నట్లు, వెక్కివెక్కి ఏడవసాగింది. ఆమె అయిష్టంగా ఆ ఎఱ్ఱ పువ్వును తీసుకుంది, తన తండ్రి చేతులను ముద్దుపెట్టుకుంది, వేడి కన్నీటి ధారలు కార్చింది.

సాయంత్రానికల్లా, అతిథులు రాసాగారు. ఆ వర్తకుడి యిల్లు త్వరలోనే మంచి మిత్రులతోనూ, బంధువులతోనూ, సంతోష ప్రియులతోనూ నిండిపోయింది. విందు అర్ధరాత్రిదాకా సాగింది. తన యింట్లో యింత చక్కని విందు జరగడం యింతకు ముందెన్నడూ ఆ వర్తకుడు చూడలేదు. ఇతరులు అందరి మాదిరిగానే అతను కూడా, వెండి, బంగారు పళ్లెరాలూ, గిన్నెలూ, ముందెన్నడూ అతని యింట చూసి ఎరుగని చిత్రవిచిత్రమైన వంటకాలూ ఎక్కడినుంచి వచ్చాయో అని ఆశ్చర్యపడ్డాడు.

ఆ మరుసటి ఉదయం ఆ వర్తకుడు తన పెద్ద కూతుర్ని పిలిచాడు, తన ప్రయాణ విశేషాలనూ వివరాలనూ మొదటినుంచి చివరిదాకా వర్ణించి చెప్పాడు. బిలవాసియైన భయంకర అడవి మృగంతో జీవితం గడిపేందుకు వెళ్లి, నన్ను దారుణమైన చావునుంచి తప్పిస్తావా అని అడిగాడు. కాని పెద్ద కూతురు కరాఖండీగా నిరాకరించి, యిలా అంది:

"ఎఱ్ఱ పువ్వు కావాలని కోరిన ఆ కూతుర్నే వెళ్లి తన తండ్రిని కాపాడమనండి, మధ్య నాకేం."

అప్పుడు ఆ వర్తకుడు తన రెండో కూతుర్ని పిలిచాడు. తనకు జరిగిన దాన్నంతనీ ముందునుంచి చివరిదాకా పూసగుచ్చినట్లు ఆమెతో చెప్పాడు. బిలవాసియైన భయంకర అడవి మృగంతో జీవితం గడిపేందుకు వెళ్లి, నన్ను దారుణమైన చావునుంచి తప్పిస్తావా అని అడిగాడు. కాని రెండవ కూతురు కరాఖండీగా తిరస్కరించి, యిలా అంది:

"ఎఱ్ఱ పువ్వు కావాలని కోరిన ఆ కూతుర్నే వెళ్లి తన తండ్రిని కాపాడమనండి, మధ్య నాకేం."

తర్వాత ఆ వర్తకుడు తన చిన్న కూతుర్ని పిలిచి, కథంతా మొదటినుంచి చివరిదాకా పూసగుచ్చినట్లు చెప్పసాగాడు. అయితే అతనింకా పూర్తి చేసీ చెయ్యకముందే, ఆమె అతని ముందు మోకరిల్లి, యిలా అంది:

"నాన్నగారూ, మీరు నన్ను ఆశీర్వదించండి. నేనా బిలవాసియైన భయంకర అడవి మృగం దగ్గరకు వెళ్లి దానితో జీవితం గడుపుతాను. మీరు ఆ ఎఱ్ఱ పువ్వుని తెచ్చింది నా కోసమే. అందుకని, మిమ్మల్ని చావునుంచి తప్పించడం నా విధి."

ఆ మాటలు విన్న వర్తకుడి కళ్లలో గిర్రున నీళ్ళు తిరిగాయి. తన కూతుర్ని అతను కౌగలించుకుని, ఆమెతో యిలా అన్నాడు:

"ఓ నా బంగారు తల్లీ, దయామయీ, ప్రియాతిప్రియమైన నా చిట్టితల్లీ, క్రూరమైన చావు నుంచి నీ తండ్రిని కాపాడినందుకూ, యిష్టపూర్తిగా, బిలవాసియైన భయంకర అడవి మృగంతో కలిసి జీవించాలని కోరుకున్నందుకూ తండ్రిగా నీకు నా ఆశీస్సులు. నువ్వు, అతని రాజభవనంలో వైభవం గానూ, సునాయాసంగానూ బతుకుతావు. కాని ఆ చోటు ఎక్కడుందో ఎవరికీ తెలియదు, ఎవరూ చెప్పలేరు. అక్కడికి వెళ్లేందుకు తోవ లేదు. నీ జాడా జాబూ మాకు తెలియదు, అలాగే మా సమాచారం నీకూ తెలియదు. నీ ముద్దు ముఖం ఎన్నడూ చూడకుండా, ప్రేమపూర్ణమైన నీ మాటలు వినకుండా యికముందరి నా విషాద జీవితం ఎలా గడుపుతానో నాకు తెలియకుండా వుంది...."

చిన్నారి ముద్దుల కూతురు తన తండ్రికి యిలా జవాబిచ్చింది:

"ప్రియమైన నాన్నగారూ, మీరు కన్నీరు పెట్టుకోకండి, విచారించకండి. నేనక్కడ ధనధాన్యాలతో, ఏ బాదరబందీ లేకుండా బతుకుతాను. బిలవాసియైన భయంకర అడవి మృగాన్ని చూసి నేను భయపడను. నేనాయనకి మనసారా, విశ్వాసంతో సేవచేస్తాను, ఆ ప్రభువు కోర్కెలన్నింటినీ నెరవేరుస్తాను. నా పైన ఆయన దయ చూపాలని ప్రార్థిస్తాను. ఇంకా బతికే వుండగా నేను చచ్చిపోయినట్లు విచారించకండి — భగవంతుడి దయ వుంటే, నేను మీ దగ్గరకు తిరిగివస్తాను."

ఆమె మాటలు ఆ వర్తకుణ్ణి ఊరడించలేకపోయాయి. తన హృదయం బద్దలవుతుందేమో అన్నట్లు, అతను వెక్కివెక్కి ఏడ్చాడు.

మూడు పగళ్ళూ, మూడు రాత్రిళ్లూ త్వరలోనే గడిచిపోయాయి. వర్తకుడికి తన ముద్దుల మూడవ కూతురునుండి విడిపోవలసిన సమయం దగ్గరపడింది. అతను ఆమెను ముద్దుపెట్టుకున్నాడు, కౌగ లించుకున్నాడు, తన వెచ్చని కన్నీటితో ఆమెను తడిపేశాడు. తర్వాత అతను ఇనప్పెట్టెలోంచి, బిలవాసి యైన భయంకర అడవి మృగం యిచ్చిన ఉంగరాన్ని తీసి, తన ముద్దుల కూతురి కుడిచేతి చిటికెన వేలికి తొడిగాడు — అంతే, ఆ మరుక్షణమే ఆమె తన వస్తువులన్నింటితోనూ మాయమైపోయింది.

బిలవాసియైన భయంకర అడవి మృగపు రాజప్రాసాదంలో పెద్ద రాతి గదిలో తను ఉన్నట్లు ఆమె



గ్రహించింది. రాజభవనమంతా పరిశీలించే ఉద్దేశంతో, ఆమె పెద్ద పెద్ద గదులన్నీ చూసింది. ఆ విచిత్రాలన్నింటినీ చూసి ఆమె అబ్బురపడింది. ప్రతి గదీ అంతకు ముందరిదాని కన్న అందంగా వుంది. ఆమె, తనకు ప్రియమైన ఎర్ర పువ్వును బంగారు భరిణలోంచి బయటకు తీసి, నవనవలాడే చెట్లతో కూడిన తోటలోకి వెళ్ళింది. అక్కడ ఆమెకు గంధర్వ సంగీతంతో పక్షులు స్వాగతం పలికాయి. చెట్లూ, పొదలూ, పువ్వులూ ఆమెకు శిరస్సులు వంచి నమస్కరిస్తున్నట్లు తలలూపాయి. ఫౌంటెన్లు మరింత ఎత్తుకి ఎగశాయి. ఆమె సమీపించిన కొద్దీ స్ఫటిక స్వచ్ఛమైన నీరు పారే సెలయేళ్ళు మరింత బిగ్గరగా గలగలధ్వని చేశాయి. వర్తకుడు ప్రపంచంలో అన్నిటికన్న అందమైన ఎర్ర పువ్వును తుంపిన పచ్చిక దిబ్బగల ఎత్తైన ప్రాంతానికి ఆమె వచ్చింది. ఆమె బంగారు భరిణలోంచి ఎర్ర పువ్వును బయటకు తీసింది, దాన్ని దాని పూర్వపు చోటులో పాతాలని అనుకుంది. కాని అది ఆమె చేతిలోంచి ఎగిరి వెళ్ళి, తన పాత తొడిమెకు కరుచుకుపోయి, అంతకు ముందరికన్న మరింత దేదీప్యమానంగా వికసించింది.

ఈ వింతల్లో వింత పట్ల, చిత్రాల్లో చిత్రం పట్ల ఆమె చాలా అబ్బురపడింది. అయితే, తనకెంతో ప్రియమైన ఎర్ర పువ్వు విషయంలో సంతోషించింది. తర్వాత ఆమె రాజప్రాసాదపు గదులకు తిరిగి వచ్చింది. వాటిలో ఒక దానిలో తన కోసం టేబిలు సర్దబడివుండటం చూసింది. ఆమె తనలో తను యిలా అనుకుంది: "బిలవాసియైన భయంకర అడవి మృగం నామీద కోపగించినట్లు లేదు, నా పైన దయగల యజమానిలాగే కనిపిస్తోంది." ఆ ఆలోచన ఆమె మనస్సులోకి రాగానే, తెల్లని పాలరాతి గోడపైన మంటల మాటలు ప్రత్యక్షమయాయి:

"నేను నీకు యజమానిని కాను, నీకు విధేయుడినైన బానిసని. నువ్వు యజమానురాలివి, నేను నీ ప్రతి ఒక్క కోర్కెనూ, ప్రతి ఒక్క అజ్ఞనూ సంతోషంగా తీరుస్తాను."

ఆమె ఆ మంటల మాటలను చదివింది. అవి మరుసటి క్షణమే, తాము అక్కడ ఎన్నడూ లేనే లేవన్నట్లుగా, మాయమైపోయాయి. తర్వాత ఆమె మనస్సులోకి, తన తండ్రికి ఉత్తరం రాయాలనీ, తనని గురించిన వార్తలు తెలియజెయ్యాలనే భావం వచ్చింది. ఆ భావం ఆమెకు కలిగిందో లేదో, వెన్వెంటనే, తన పక్కన ఒక బంగారపు కలం, సిరా, కాగితం ఉండటం ఆమె చూసింది. ఆమె ప్రియమైన తన తండ్రికీ, ప్రియమైన తన అక్కలకీ యిలా ఉత్తరం రాసింది:

"బిలవాసియైన భయంకర అడవి మృగపు రాజప్రాసాదంలో నేను రాజకుమారిలా వుంటున్నాను. అందుకని మీరు నాకోసం ఏడవకండి, విచారించకండి. నాకు ఆయన కనిపించడు, నేనాయన మాట వినలేను. కాని తెల్ల పాలరాతి గోడమీద ఆయన నాకోసం మంటల మాటల్లో రాస్తాడు. నన్నాయన యజమానురాలు అని పిలుస్తున్నాడు. నేనాయన్ని ప్రభూ, అని పిలిస్తే ఒప్పుకోవడం లేదు."

ఆమె ఆ ఉత్తరాన్ని రాసిందో లేదో, అది ఆమె చేతుల్లోంచీ, ఆమె దృష్టినుంచీ, తను అక్కడ ఎన్నడూ లేనే లేదన్నట్లు, మాయమైపోయింది. సంగీతం మరింత లయబద్ధంగా వినిపించసాగింది. మెరుగు పెట్టిన బంగారు పాత్రల్లో మిఠాయిలూ, పానీయాలూ టేబిలుమీద ప్రత్యక్షమయాయి. తన జీవితంలో ఎన్నడూ ఆమె ఒంటరిగా భోజనం చెయ్యలేదు. అయినా ఆమె హుషారుగా టేబిలుముందు కూర్చొని, తిని, తాగి, తియ్యని సంగీతం వింటూ సేద దేరింది. కడుపార భోజనం చేశాక ఆమె తోటలో నడిచేందుకు వెళ్లింది.

రాత్రి భోజనానికి ముందు తోటలో సగంకన్న ఎక్కువ తను చూడలేకపోయింది. అక్కడి విచిత్రాలన్నీ చూడలేకపోయింది. చెట్లు, పొదలు, పువ్వులు — అన్నీ ఆమెకు తలలు వంచి నమస్కరించాయి. ముగ్గిన పళ్లు — పియర్స్, పీచ్‌లు, రసవంతాలైన ఆపిల్సు — ఆమెకు నోరూరించాయి. సాయంత్రం పడేదాకా ఆమె తోటలో నడిచి, తర్వాత విశాలమైన తన గదులకు తిరిగివచ్చింది. అక్కడ ఆమె టేబిలుపైన అపురూపమైన మిఠాయిలూ, పానీయాలూ అమర్చివుండటం చూసింది.

సాయంకాల భోజనం అయాక ఆమె మళ్లీ గోడపైన మంటల మాటలు కనిపించిన పాలరాతి గది లోకి వెళ్లింది. అదే గోడపైన రాయబడుతున్న యీ కింది మాటలను ఆమె చూసింది:

"తన తోటలూ, గదులూ, ఆతిథ్యం, సేవలూ నా యజమానురాలికి నచ్చాయా?"

వర్తకుని అందమైన చిన్న కూతురు సంతోష స్వరంలో జవాబిచ్చింది:

"నన్ను మీ యజమానురాలని పిలవకండి. మీరే నాకు సదా, దయాపరులైన మంచి యజమానిగా ఉండండి. మీ ఆతిథ్యం అంతటికీ మీకు నా కృతజ్ఞతలు. అయినా చెప్పండి, యీ విశాల ప్రపంచంలో ఎక్కడైనా యింత విశాలమైన గదులూ, యింత నవనవలాడే తోటలూ వున్నాయా? మరి అలాంటప్పుడు నేనెందుకు తృప్తిగా వుండకపోవాలి? నా జీవితంలో ఎన్నడూ నేను యిలాంటి వింతలు చూడలేదు. ఇదంతా



నిజమేనని నాకింకా నమ్మకం కలగడం లేదు. అయితే ఒకటుంది: ఒంటరిగా పడుకోడానికి నాకు భయంగా వుంది. మీ పెద్ద గదుల్లో ఎక్కడా నరసంచారం లేదు.''

ఈ కింది మంటల మాటలు గోడపైన కనిపించాయి:

''అందమైన నా యజమానురాలా, నువ్వు భయపడకు, ఒంటరిగా నువ్వు నిద్రపోవు. నమ్మకస్తురాలైన, ప్రియమైన నీ పనిమనిషి నీకోసం వేచివుంది. ఈ గదుల్లో చాలమంది మనుషులు నివసిస్తున్నారు. వాళ్ళు నీకు కనిపించరు, నీతో మాట్లాడరు అంతే. నా మాదిరిగానే, వాళ్ళందరూ నీకు రాత్రింబగళ్ళు కాపలా కాస్తున్నారు.''

తర్వాత వర్తకుడి అందమైన చిన్న కూతురు తన పడక గదికి వెళ్ళింది. అక్కడ ఆమెకు నమ్మకస్తురాలైన, ప్రియమైన తన పనిమనిషి కనిపించింది. హంసతూలికా తల్పం దగ్గర నిలబడ్డ ఆ పనిమనిషి భయంతో బిక్కచచ్చిపోయివుంది. కాని తన యజమానురాలిని చూడగానే ఆమె సంతోషించి, తామర పూరేకుల్లా వున్న ఆమె చేతులను ముద్దుపెట్టుకొంది, నాజూకైన ఆమె పాదాలను కౌగలించుకుంది. ఆమె యజమానురాలు కూడా ఆమెను అక్కడ చూడగలిగినందుకు సంతోషించి, ప్రియమైన తన తండ్రిని గురించీ, తన అక్కల గురించీ, యితర దాసీలను గురించీ, సేవకులను గురించీ ప్రశ్నల వర్షం కురిపించింది. తర్వాత తన అనుభవాలను వర్ణించి చెప్పనారంభించింది — అలా కబుర్లలో తూర్పు తెల్లవారేదాకా వాళ్ళిద్దరూ జాగారం చేశారు.

ఆ విధంగా వర్తకుడి అందాల చిన్న కూతురు తన కొత్త యింట్లో సుఖంగా జీవిస్తోంది. ప్రతిరోజూ, విలువైన కొత్తకొత్త దుస్తులూ, మాటల్లోగాని, రాతల్లోగాని వర్ణించడానికి సాధ్యం కానంతటి విలువైన వైభవోపేతమైన సామాన్లూ ఆమెకోసం అమర్చబడుతూ వుండేవి. ప్రతిరోజూ కొత్తకొత్త వినోదాలూ, కాలక్షేపాలూ: చీకటిగా వున్న అడవుల్లో గుర్రాల్లేని, కళ్ళేలు లేని బళ్ళలో షికార్లు సాగుతూండేవి. అంతసేపూ తియ్యటి సంగీతం వినవస్తూండేది. ఆ సంగీతానికి లయబద్ధంగా పోయే బండికి చెట్లు పక్కకి వైదొలగి, మెత్తగా సాగిపోయేందుకు విశాలమైన దారిని చేసేవి. కన్నెలకు సహజమైన చేతిపనుల్లో ఆమె నిమగ్నురాలయేది: వెండి, బంగారు జరీపోగులతో దీర్ఘమైన వస్త్రాలు అల్లి, వాటికి ముత్యాల కుచ్చులు కుట్టేది. ప్రియమైన తన తండ్రికి ఆమె బహుమతులు పంపుతూండేది. అయితే అన్నింటి కన్న మంచి

వస్త్రాన్ని దయాళువైన తన సంరక్షకుడికి కానుకగా యిచ్చింది. రోజులు గడిచేకొద్దీ ఆమె మరింత తరచుగా పాలరాతి హాలులోకి వెళ్లి, యీవిగల తన సంరక్షకునికి కృతజ్ఞతలు తెలిపి, గోడపై మంటల మాటల్లో అతనిచ్చే జవాబుల కోసం తహతహలాడేది.

ఆ విధంగా కాలం గడవసాగింది — పని జరగడం కన్న కథ చెప్పడం తొందరగా ముగుస్తుంది కదా. వర్తకుడి అందాల చిన్న కూతురు తన కొత్త జీవితానికీ, కొత్త యింటికీ అలవాటుపడింది. ఇప్పుడిక ఏదీ ఆమెకు ఆశ్చర్యంగాని, భయంగాని కలిగించడం లేదు. దయాళువైన తన యజమాని పట్ల ఆమెకు నానాటికీ యిష్టం పెరిగింది. తనను తాను ప్రేమించుకున్నదాని కన్న ఆమెను అతను ఎక్కువ ప్రేమిస్తున్న సంగతిని ఆమె కనిపెట్టింది. తనను యజమానురాలని ఊరికే పిలవడం లేదని గ్రహించింది. అతని స్వరాన్ని వినాలనీ, ఆ పాలరాతి గదిలోకి వెళ్లకుండానూ, మంటల మాటలను చదవకుండానూ అతనితో సంభాషించాలనీ ఆమె తహతహలాడసాగింది.

ఆమె అతన్ని అందుకు వేడుకోసాగింది, ప్రార్థించసాగింది. కాని బిలవాసియైన ఆ భయంకర అడవి మృగం ఆమె కోర్కెను ఒక పట్టాన మన్నించలేదు. తన స్వరం ఆమెను భయభీతురాలిని చెయ్యవచ్చునన్న భయమే అందుకు కారణం. కాని ఆమె దయామయుడైన తన సంరక్షకుణ్ణి అర్థిస్తూ, వేడుకొంటూనే వుంది. అతనింక ఎంతమాత్రం ఆమె కోర్కెను కాదనలేకపోయాడు. చిట్టచివరకు అతను ఆఖరిసారిగా పాలరాతి గోడమీద మంటల మాటలతో యిలా రాశాడు:

"ఈ రోజున తోటలోకి వచ్చి, ఆకులతో, కొమ్మలతో, పూలతో అల్లుకొన్న నీ అభిమానపాత్రమైన పొదరింటిలో కూర్చొని, 'విశ్వాసపాత్రమైన నా బానిసా, నాతో మాట్లాడు' అను."

ఓ క్షణం గడిచిందో లేదో వర్తకుడి అందాల కూతురు తోటలోకి పరుగెత్తుకెళ్లి, తన అభిమానపాత్రమైన పొదరింటిలో ప్రవేశించి, యిలా అంది:

"నువ్వు నీ స్వరంతో నన్ను భయపెడతానేమోనని దయాళువైన నా యజమానీ నువ్వు భయపడకు. దయామయమైన నీ చేతల తర్వాత, అడవి మృగం గర్జలు వినవలసివచ్చినా నేను భయపడను. నువ్వు జంకకుండా నాతో మాట్లాడు."

పొదరిల్లు వెనకనుంచి ఎవరో నిట్టూరుస్తున్నట్లు ఆమెకు వినిపించింది. ఇంకా నెమ్మదిగానే అయినా,

ఆటవికమైన, గుర్రుమనే, బొంగురుగా, కర్కశంగా వున్న భయంకరమైన ఒక స్వరం ఆమెకు వినిపించింది. వర్తకుడి అందాల చిన్న కూతురు బిలవాసియైన భయంకర అడవి మృగం స్వరం వినగానే మొదట్లో ఉలిక్కిపడింది. అయినా అంతలోనే తన భయాన్ని అణిచిపెట్టి, తను భయపడిన చిన్నెలు కనిపించకుండా మరుగు పరచింది. అంతలోనే, అతని దయాపూర్ణమైన, స్వాగత వాక్యాలను, అతని తెలివైన, వివేకవంతమైన మాటలను ఆమె వినసాగింది. దానితో ఆమె మనస్సు తేలికపడింది.

అప్పటినుంచి, వాళ్ల మధ్య ఎడతెగకుండా సంభాషణ సాగింది. నవనవలాడే తోటల్లో నడుస్తూనో, కారడవుల్లో బండిపై షికారు వెళ్తూనో, విశాలమైన రాజభవనపు గదుల్లోనో దాదాపు రోజంతా వాళ్ళు మాట్లాడుకొంటూ గడిపేవారు. మధ్యమధ్య వర్తకుడి అందాల చిన్న కూతురు అడుగుతూ వుండేది:

"మంచివాడివీ, దయామయుడివీ అయిన నా యజమానీ నువ్విక్కడే వున్నావా?"

బిలవాసియైన ఆ భయంకర అడవి మృగం యిలా జవాబిచ్చేది:

"నీ విశ్వాసపాత్రుడివైన బానిసనూ, నీ శాశ్వత మిత్రుడినీ అయిన నేను యిక్కడే వున్నాను నా అందాల యజమానురాలా."

ఆటవికమూ, భయంకరమూ అయిన అతని స్వరం ఆమెకు యింకెంతమాత్రమూ భయం కలిగించడం మానేసింది. వాళ్ళు అంతూ దరీలేకుండా ప్రేమగా మాట్లాడుకొనేవారు.

తొందరగానే గడిచిందో, మెల్లగానే గడిచిందో నేను చెప్పలేనుగాని, కాలం గడిచింది. వర్తకుడి అందాల చిన్న కూతురు బిలవాసియైన భయంకర అడవి మృగాన్ని తన సొంత కళ్లతో చూడాలని కోరింది. ఆమె అతన్ని వేడుకో సాగింది, బతిమాలసాగింది. ఆమె తనను చూసి ఎక్కడ జడుసుకుంటుందో నని, చాలకాలం వరకు అతను కనిపించేందుకు ఒప్పుకోలేదు — అతను నిజంగానే, మాటలుగాని, రాతలుగాని వర్ణించలేనంత వికారంగా వుండటమే అందుకు కారణం. అందుకని, బిలవాసియైన భయంకర అడవి మృగం ఆమెకు యిలా చెప్పాడు:

"చూస్తేనే కళ్లకి పండుగ చేసే అందాల నా యజమానురాలా, నీకు నా భయంకరమైన ముఖాన్నీ, వికారమైన శరీరాకారాన్నీ చూపించమని నన్ను బలవంతపెట్టవద్దు, బతిమాలవద్దు. నా స్వరానికి నువ్విప్పుడు అలవాటుపడ్డావు. మనం యిప్పుడు శాంతిసామరస్యాలతో జీవిస్తున్నాం. దాదాపుగా

ఎప్పుడూ ఎడబాటు లేకుండా వుంటున్నాం. నీ పట్ల నా అంతులేని ప్రేమ మూలంగా నువ్వు నన్ను ప్రేమిస్తున్నావు. అలా కాకుండా, అసహ్యకరమూ, భయంకరమూ అయిన నా నిజ రూపాన్ని నువ్వు చూసినట్లయితే దురదృష్టవంతుడినైన నన్ను నువ్వు ద్వేషించి, నీ ముందునుంచి నన్ను తరిమేస్తావు. నీ నుండి విడిపోవలసివస్తే విచారంతో నేను చచ్చిపోవలసిందే తప్ప మరో మార్గం వుండదు.''

కాని, వర్తకుడి అందాల చిన్న కూతురు అతని మాటలను చెవిన పెట్టలేదు. అతన్ని పూర్వంకన్న మరింత ఎక్కువగా బతిమాలింది. భూలోకంలోని ఏ భయంకర రాక్షసీ కూడా తనను భయపెట్టలేదని హామీ యిచ్చింది. దయాళువైన తన యజమానిని తను ప్రేమించకుండా ఎన్నడూ వుండనని మాట యిచ్చింది.

బిలవాసియైన భయంకర అడవి మృగం చాలాకాలం ఆమె కోర్కెను తిరస్కరించింది. కాని ఆ అందాల కన్య బతిమలాటనూ, కన్నీళ్లనూ ఎక్కువ కాలం తోసిపుచ్చలేకపోయింది. చివరకు యిలా అంది:

''నేను నిన్ను, నా కంటె కూడా ఎక్కువగా ప్రేమిస్తున్నాను, అందుకని నీ కోర్కెను నేను కాదనలేను. నేను నా ఆనందాన్ని నాశనం చేసుకుంటాననీ, ఆయువు తీరక ముందే చచ్చిపోతాననీ తెలిసినా కూడా, నేను నీ కోర్కె తీరుస్తాను. సూర్యుడు అడవి వెనక అస్తమించే వేళ, కను చీకటి వేళ తోటలోకి వచ్చి, యిలా అను: 'నమ్మకమైన నా మిత్రమా, నువ్వు నాకు కనిపించు.' నా అసహ్యకరమైన ముఖాన్నీ, వికృతమైన శరీరాన్నీ నీకు నేను చూపిస్తాను. నన్ను చూశాక నువ్విక్కడ యింకెంతమాత్రం ఉండలేకపోయినట్లయితే, నిన్ను, నీ యిష్టానికి వ్యతిరేకంగా యిక్కడ శాశ్వతమైన మానసిక బాధలో వుంచాలని నేను కోరుకోను. నీ పడకగదిలో తలగడా కింద నా బంగారు ఉంగరం వుంటుంది. దాన్ని నువ్వు నీ కుడిచేతి చిటికెన వేలికి పెట్టుకో చాలు, నువ్వు నీ ప్రియమైన తండ్రి యింట్లో వుంటావు. నీకీ జన్మలో మళ్లీ నా జోలీ శొంఠీ వుండదు.''

వర్తకుడి అందాల చిన్న కూతురు గాభరాపడలేదు, భయపడలేదు. ఆమె తన నిర్ణయానికే గట్టిగా కట్టుబడి వుంది. ఒక్క క్షణం కూడా వృథా చెయ్యకుండా ఆమె తోటలోకి వెళ్లి నిర్ణీత సమయంకోసం ఎదురుచూడసాగింది. అడవి వెనక సూర్యుడు కుంగిపోయి, కను చీకటి పడగానే ఆమె యిలా పిలిచింది:



“నమ్మకమైన నా మిత్రమా, నువ్వు నాకు కనిపించు!” అల్లంత దూరాన, బిలవాసియైన భయంకర అడవి మృగం ఆమెకు కనపడింది. అది తోవవెంట నడవడం మాత్రమే నడిచి, హడావిడిగా దట్టమైన పొదల్లోకి మాయమై పోయింది. కాని వర్తకుడి అందాల చిన్న కూతురు దాన్ని చూడగానే, తామర పూరేకుల్లాంటి తన చేతులను ఊపి, తీవ్రమైన మానసిక వేదనతో కేకవేసి, బాటపైన మూర్ఛపోయింది.

వర్తకుడి అందాల చిన్న కూతురు స్పృహ తప్పి ఎంత సేపు అక్కడ పడుకొని ఉండిపోయిందో తెలీదు కాని, చివరకు తెప్పరిల్లి, తన పక్కనే ఎవరో కుమిలి కుమిలి ఏడుస్తూ, జాలిగొలిపే స్వరంలో వెక్కుతూ వుండటం వింది:

“నా ప్రియమైన అందాల కన్నె. పిల్లా, నువ్వు నన్ను నాశనంచేశావు, చంపేశావు. నేనిక నీ అందమైన ముఖాన్ని చూడను. నేనిలా ఆయువు పూర్తికాక ముందే మరణించవలసిందే.”

ఆమె తన అతిభయాన్నీ, కన్నె హృదయపు బెరుకునూ జయించి, దృఢంగా యిలా చెప్పింది:

“దయాళువైన, దైవంలాంటి నా యజమానీ, నువ్వు ఆ విషయంలో భయం పెట్టుకోకు. నీ భయంకర రూపంచూసి నేనింక ఎప్పుడూ భయపడను. నేను నిన్ను విడిచివెళ్లను, నీ మంచితనాన్ని మరచిపోను. ఇప్పుడిక నువ్వు నీ పూర్వ రూపంలో నాకు కనిపించు. మొట్టమొదటిసారి అవడం మూలాన నేను భయపడ్డానంతే.”

బిలవాసియైన భయంకర అడవి మృగం అసహ్యకరమైన, వికృతమైన, తన భయంకర రూపంలో ఆమెకు కనిపించింది. ఆమె ఎంత పిలిచినా కూడా, అది ఆమె దగ్గరకు వచ్చేందుకు సాహసించలేదు. మరుసటి రోజున ఆమె, బిలవాసియైన భయంకర అడవి మృగాన్ని పట్టపగటి వెల్తురులో చూసింది. ముందు దాన్ని చూడగానే బెదురు కలిగిందిగాని, దాన్ని ఆమె బయటపడనివ్వలేదు, త్వరలోనే ఆమెకు భయం పోయింది. ఇప్పుడు వాళ్లిద్దరూ పూర్వం కన్న ఎక్కువగా కబుర్లు చెప్పుకున్నారు. రోజంతా కలిసే వున్నారు. సాయంత్రం, రాత్రీ భోజనాల దగ్గర యిద్దరూ కలిసే కూర్చొని మిఠాయిలు కడుపారా తిని, పానీయాలు తాగి సేదదీర్చుకున్నారు. తర్వాత వాళ్ళు నవనవలాడే తోటలో షికారుచేశారు, కారడవుల్లో గుర్రాలు లేని బళ్లలో వాహ్యాళి వెళ్లారు.

అలా అలా కాలం చాలానే గడిచిపోయింది: ఏదైనా జరగడం కన్న, జరిగినదాన్ని గురించిన కథని

తొందరగా చెప్పొచ్చు. కాని ఒక రాత్రి, నిద్రలో, వర్తకుడి అందాల చిన్న కూతురు, తన తండ్రి జబ్బు పడి, మంచంలో ఉన్నట్లు కలగంది. ఆమెకి అణుచుకోలేనంత దుఃఖం కలిగింది. ఆమె దుఃఖంతో కన్నీళ్లు కారుస్తూ వుండటాన్ని బిలవాసియైన భయంకర అడవి మృగం ఎప్పుడైతే చూసిందో, దానికి కూడా తీవ్రమైన దుఃఖం కలిగింది. ఆమె దుఃఖానికీ, కన్నీళ్లకీ కారణమేమిటో ప్రశ్నించింది. అప్పుడామె దుఃఖకారణమైన తన కలని గురించి చెప్పి, ప్రియమైన తన తండ్రినీ, అక్కలనీ చూసేందుకు అనుమతించవలసిందిగా వేడుకుంది. బిలవాసియైన భయంకర అడవి మృగం యిలా చెప్పింది:

''నీకు నా అనుమతితో పనేముంది? నీ దగ్గర నా బంగారు ఉంగరం వుంది. దాన్ని నీ కుడిచేతి చిటికెన వేలికి పెట్టుకో, వెంటనే నువ్వు ప్రియమైన నీ తండ్రి యింట్లో వుంటావు. ఆయనతో నీ యిష్టం వచ్చినంత కాలం వుండు. అయితే నీకు నేనొక విషయం చెప్పాల్సివుంది: మూడు పగళ్లూ మూడు రాత్రులూ గడవగానే నువ్వు కనుక తిరిగి రాకపోతే నువ్వు నన్ను ప్రాణంతో చూడలేవు, అదే క్షణంలో నేను చచ్చిపోతాను. కారణం ఏమిటంటావేమో, నన్ను నేను ప్రేమించుకొనే దానికన్న నిన్ను నేను ఎక్కువ ప్రేమిస్తున్నాను, నువ్వు లేకుండా నేను బతకలేను.''

ఆమె గంభీరమైన మాటలతోనూ, ఒట్లతోనూ, మూడు పగళ్లూ, మూడు రాత్రులూ గడిచిపోయేందుకు సరిగా ఒక గంట ముందే అతని విశాలమైన రాజప్రాసాదానికి తను తిరిగివస్తానని హామీ యిచ్చింది. దయాళువైన తన యజమాని దగ్గర సెలవు తీసుకొని, బంగారు ఉంగరాన్ని తన కుడిచేతి చిటికెన వేలికి పెట్టుకుంది. అదే క్షణంలో ప్రియమైన తన తండ్రియైన వర్తకుడి యింటి విశాలమైన ముంగిట్లో వుంది.

చాలసేపు తండ్రీ కూతుళ్లు ఒకర్నొకరు ముద్దులు పెట్టుకొని, కౌగలించుకొని, ప్రేమపూర్వకమైన మాటలు చెప్పుకున్నారు. తర్వాత ఆమె ప్రియమైన తన తండ్రికీ, అక్కలకీ బిలవాసియైన భయంకర అడవి మృగంతో తను జీవితం ఎలా గడుపుతున్నదీ, ఏ ఒక్క విషయాన్నీ దాచకుండా చెప్పవలసిందంతా పూసగుచ్చినట్టు చెప్పింది. ఆమె ఐశ్వర్యవంతమైన, రాణిగారి మాదిరి జీవితం గడుపుతున్నందుకు వర్తకుడు సంతోషించాడు. భయంకరమైన తన యజమానిని చూసేందుకు ఆమె అలవాటు పడటం, బిలవాసియైన భయంకర అడవి మృగాన్ని చూసి భయపడకపోవడం అతనికి అబ్బురం కలిగించాయి.

ఆమ చిన్న చెల్లెలికి గల అపరిమిత ఐశ్వర్యాలను గురించీ, ఆమె యజమానే ఆమె బానిసా అన్నంతగా, అతనిపైన ఆమెకు గల అధికార ప్రాబల్యాన్ని గురించీ ఆమె అక్కలు ఈర్ష్య చెందారు.

ఆ రోజు ఒక గంటలా గడిచిపోయింది, రెండో రోజు ఒక నిమిషంలా గడిచిపోయింది. మూడవ రోజున ఆమె అక్కలు బిలవాసియైన భయంకర అడవి మృగం దగ్గరకి తిరిగివెళ్లొద్దని తమ చిన్న చెల్లెలికి నచ్చ చెప్పడం మొదలుపెట్టారు. "దాన్ని చావనియ్, దానికి ఆ శాస్తి కావలసిందే..." అన్నారు వాళ్లు. కాని ప్రియమైన వాళ్ల అతిథియైన చిన్న చెల్లెలు కోపించి, తమ అక్కలతో యిలా అంది:

"తను చూపిన విశేషమైన దయకీ, అపారమైన, ఉత్సాహపూరితమైన ప్రేమకీ గాను, దయాపరుడైన సదయహృదయుడైన నా యజమానికి నేను క్రూరమైన చావుతో బదులు తీర్చుకున్నట్లయితే, అప్పుడిక యీ ప్రపంచంలో బతికే అర్హత నాకు వుండదు. అప్పుడు నన్ను, ముక్కముక్కలుగా పీక్కొని తినేందుకుగాను క్రూర మృగాలకు ఎరగా పారెయ్యాలి."

ఆమె తండ్రి, వర్తకుడు, ఉదాత్తమైన యీ మాటలకుగాను ఆమెను పొగిడాడు. సహృదయురాలూ, దయామయీ అయిన అతని అందాల చిన్న కూతురు గడువుకి సరిగా ఒక గంట ముందు బిలవాసియైన భయంకర అడవి మృగం దగ్గరకు తిరిగి వెళ్లాలని నిర్ణయం జరిగింది. కాని ఆమె అక్కలకు యిది నచ్చలేదు. వాళ్లు నిర్దయగా ఒక జిత్తులమారి పన్నాగం పన్నారు. ఇంట్లోని గడియారాలన్నింటినీ వాళ్లొక పూర్తి గంట వెనక్కి పెట్టేశారు.

అసలైన గంట సమీపించగానే, ఏదో తనను చికాకు పరుస్తోందేమో అన్నట్లు, వర్తకుడి అందాల చిన్న కూతురు బాధతోనూ, గుండె నొప్పితోనూ గిలగిలలాడింది. ఆమె అదే పనిగా తన తండ్రి ఇంగ్లీషు, జర్మన్ గడియారాల వంక చూడసాగింది. అయితే అవన్నీ, దూరప్రయాణానికి యింకా చాలా పొద్దున్నట్లు చూపాయి. అంతసేపూ ఆమె అక్కలు, ఆమె ప్రయాణాన్ని వాయిదా వేయించేందుకుగాను, యీ విషయం ఆ విషయం అడుగుతూ, యీ మాటా ఆ మాటా చెప్తూ గడిపారు. చివరకు ఆమె వేదన దుర్భరమైపోయింది. వర్తకుడి అందాల, ముద్దుల చిన్న కూతురు వర్తకుడికి, తన ప్రియమైన తండ్రికి వీడ్కోలు చెప్పింది, తన అక్కల దగ్గర సెలవు తీసుకుంది. నిర్ణీతమైన గంటకు ఒక నిమిషం ముందు ఆమె తన కుడిచేతి చిటికెన వేలికి ఉంగరాన్ని ధరించింది. అదే క్షణం బిలవాసియైన భయంకర



అడవి మృగపు పాలరాతి రాజభవనంలోని విశాలమైన గదుల్లో వుంది. తనని కలుసుకునేందుకు అతనెందుకు రాలేదా అని ఆశ్చర్యపడి, బిగ్గరగా యిలా అరిచింది:

"దయాపరుడివైన నా ప్రభూ, నా విశ్వసనీయ మిత్రమా, నువ్వెక్కడున్నావ్? నువ్వు నన్నెందుకు కలుసుకోలేదు? నేను నిర్ణీత సమయానికి పూర్తి ఒక గంటపైన ఒక నిమిషం ముందుగా వచ్చేశాను."

జవాబు రాలేదు. ఎవరూ ఆమెను పలకరించలేదు. శ్మశాన నిశ్శబ్దం ఆవరించింది. వర్తకుడి అందాల చిన్న కూతురు మనస్సంతా కీడు మూడబోతున్న భయంతో నిండిపోయింది. భయంతో ఆమె గుండె జలదరించింది. ఆమె తనకు మహా యిష్టమైన ఎర్ర పువ్వు పెరిగిన పచ్చిక మొలిచిన మట్టి దిబ్బ దగ్గరకి పరుగెత్తింది. అక్కడ, దిబ్బమీద, తన వంకరటింకర పంజాలతో ఎర్ర పువ్వును పట్టుకొని, బిలవాసియైన భయంకర అడవి మృగం పడుకొని వుండటం ఆమె చూసింది. మొదట ఆమె, తన కోసం వేచి చూస్తూ, అది అక్కడ నిద్రపోయి వుంటుందనీ, యిప్పుడు గాఢనిద్రలో మునిగిపోయిందనీ అనుకుంది.

వర్తకుడి అందాల చిన్న కూతురు అడవి మృగాన్ని మెల్లగా లేపనారంభించింది. కాని అది విని పించుకోకపోయేసరికి, దాని వంకరటింకర పంజాను పట్టుకొని, గట్టిగా కుదిపి లేపనారంభించింది. అప్పటికి ఆమెకి తెలిసివచ్చింది, బిలవాసియైన భయంకర అడవి మృగం ఊపిరి తీసుకోవడం లేదనీ, ప్రాణం లేనిదానిలా పడివుందనీ...

ఆమె తేటకళ్ళు మసకబారాయి, ఆమె కాళ్ళు చచ్చుబడ్డాయి, ఆమె తన మోకాళ్ళపై కూలబడింది. ఆమె, తామర పూరేకులవంటి తన తెల్లని చేతులను దయామయుడైన తన యజమాని తల చుట్టూ — అసహ్యకరమైన, భయంకరమైన తల చుట్టూ — వేసి, వేదనతో నిండిన స్వరంతో యిలా అరిచింది:

"ఓ నా ప్రాణమిత్రమా, లే, మేలుకో, నేను నిన్ను నా ప్రియతముడిగా ప్రేమిస్తున్నాను."

ఆమె యీ మాటలు పలకగానే చుట్టూ కళ్ళు మిరుమిట్లు గొలిపేలా మెరుపులు మెరిశాయి. ఉరుముల గర్జలకు భూమి దద్దరిల్లింది. పచ్చిక మొలిచిన మట్టిదిబ్బమీద పెద్ద పిడుగు పడింది. వర్తకుడి అందాల చిన్న కూతురు స్పృహ కోల్పోయి నేలమీద ఒరిగిపోయింది. ఆమె ఎంతకాలం అలా వుండిపోయిందో నాకు తెలియదు. కాని ఆమెకు తెలివి వచ్చేసరికి విశాలమైన పాలరాతి గదిలో, నవరత్నాలు



పొదిగిన బంగారు సింహాసనంపైన తను ఉన్నట్లు ఆమె కనుగొంది. చిత్రాల్లో రాజకుమారుడంతటి అందమైన రాజకుమారుడొకడు ఆమె చుట్టూ చెయ్యివేసి కూర్చున్నాడు.

రాజకిరీటంతో వున్న అందమైన ఆ యువకుడు ఆమెతో యిలా అన్నాడు:

"సాటిలేని అందాలరాశీ, దయాపూరితమైన నా హృదయాన్నీ, నీ పట్ల నాకున్న ప్రేమనీ చూసి, నువ్వు నన్ను ప్రేమించావు. వికృతమైన అడవి మృగం రూపంలో నన్ను ప్రేమించావు. ఇప్పుడిక యీ మానవాకారంలో నువ్వు నన్ను ప్రేమించు, నా ప్రియమైన భార్యవి అవు. చనిపోయిన నా తండ్రి పట్ల ఒక దుష్ట మంత్రకత్తె కోపగించింది. నేనింకా చిన్నపిల్లవాడిగా ఉన్నప్పుడు నన్నామె మహారాజైన నా తండ్రి దగ్గర్నుంచి, తన మంత్ర విద్య సాయంతో, ఎత్తుకుపోయింది. తన దుష్ట శక్తితో నన్నొక భయంకర అడవి మృగంగా మార్చేసింది. ఆమె నాకొక శాపం యిచ్చింది. దాని ప్రకారం, మనుషులకీ, భూలోకంలోని ప్రాణులన్నింటికీ అసహ్యాన్నీ, భయాన్నీ కలిగించే వికృత రూపంలో నేను బతకాలి. ఎంతవరకో తెలుసా? ఏ కులంలో పుట్టినదైనా, ధనికురాలైనా, పేదదైనా సరే అందమైన ఒక కన్నెపిల్ల, నా అడవి మృగం రూపంలో నన్ను ప్రేమించి, పెళ్లాడి, భార్యగా ఉండాలని కోరుకునేదాకా నేనలా బతకాలి. అప్పుడు ఆ శాపం తొలగిపోతుంది, నాకు మానవ రూపం వస్తుంది. నేను చూడటానికి అందమైన యువకుడిని అవుతాను. ఒక అడవి మృగంలా, చూస్తే జడుసుకునేటంత భయంకరంగా నేనలా ముప్ఫయ్యేళ్లపాటు బతికాను. మంత్రబద్ధమైన నా రాజభవనానికి పదకొండుమంది అందమైన కన్నెపిల్లలను ఆకర్షించాను. నువ్వు పన్నెండోదానివి. నా మంచితనాన్నీ, ప్రేమనీ చూసి, దయాపూరితమైన నా హృదయాన్ని చూసీ ఒక్క కన్నె పిల్ల కూడా నన్ను ప్రేమించిన పాపాన పోలేదు. అసహ్యకరమూ, వికృతమూ అయిన రూపంలో వున్నాకూడా నువ్వొక్కదానివే నన్ను ప్రేమించావు. నా ప్రేమ కోసం, మంచితనం కోసం, దయతో నిండిన నా హృదయం కోసం, నువ్వంటే నాకు గల అపారమైన ప్రేమ కోసం నువ్వు నన్ను ప్రేమించావు. అందుకే నువ్వొక గొప్ప రాజుకి భార్యవి అవుతావు. ఒక మహత్తర రాజ్యానికి రాణివి అవుతావు."

